శుభమస్తు.

శ్రీ

# సారంగధర చరిత్రము.

ఇయ్యది

హరికథారూపంబున విశాఖపట్టణము దరి

అల్లిపుర వాసుండగు

మద్ది రంగనాయకునిచే రచియింపంబడి

తద్గ్రంథకర్తవలన హక్కునడసి అనకాపల్లి వాసుండగు

బీ. బాలాజీదాసుని వలన

బెజవాడ వాణీముద్రాగారంబున

బి. కే. స్వామిచే

ముద్రింపించి ప్రచురింపంబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు.

1914.



వెల రు **0-6-0.**

# పీఠిక

చదువరులారా!

నేను చిన్నప్పటినుంచి భజనకీర్తన లించుక బాడుట నభ్యసించి యుండ దైవకటాక్షంబున నించుక కవితాధోరణియలవడ నంత లక్షణము నేర్చుకొన నుద్దేశించి నావిద్యాగురుండగు శ్రీపొట్నూరి వేంకటస్వామి పట్నాయుడుగారిని బ్రార్థింప వారికి తీరిక లేక శ్రీపక్కి యప్పల నారసింహ కవిసత్తము నాశ్రయింపుమని యానతినొసంగ విని తదప్పల నారసింహ కవిగ్రామణిని దర్శించి కొంత లక్షణమార్గమును దెలిసికొని యిదివఱకు బాలసుందర రచించి యిప్పుడీగ్రంథమును వ్రాసి వెల్లడించితి నిందుల తప్పులున్న జక్క జేసికొని యుపయోగింప వేడుకొను

విధేయుడు,

 మద్ది రంగనాయకదాసు.

# ప్రకటన.

ఈక్రింద నుదహరించిన పొత్తములు వలయువారు విశాఖపట్టణము జిల్లా అనకాపల్లిలోనున్న బీ. బాలాజీదానునకు వ్రాసిన వచ్చును.

| | |
|---|---|
| 0-6-0 | ప్రియంవదా చరిత్రము. |
| 0-6-0 | సీతాకల్యాణము. |
| 0-6-0 | నలచరిత్ర. |
| 0-6-0 | జయప్రద లేక పురూరవ. |
| 0-6-0 | త్రైశంకు విజయము లేక హరిశ్చంద్ర. |
| 0-6-0 | గయోపాఖ్యానము. |
| 0-8-0 | రుక్మాంగద లేక యేకాదశీ మాహాత్మ్యము. |
| 0-4-0 | ద్రౌపదీ మానసంరక్షణము. |
| 0-4-0 | పురందరదాసు చరిత్రము. |
| 0-4-0 | సూరదాసు చరిత్ర. |
| 0-4-0 | కర్ణానందదాయని పద్యములు. |
| 0-4-0 | హరికథేతిహాసమంజరి. మొదటిభాగము (పద్యములు.) |
| 0-4-0 | ,, రెండవ ,, కీర్తనలు. |
| 0-4-0 | బాలసుందర. మద్ది రంగనాయక రచితము. |
| 0-4-0 | సారంగధర. డిటో |
| 0-6-0 | సారంగధర. సూరాబత్తుల సూర్యనారాయణగారి రచితం. |
| 0-8-0 | కుచేలోపాఖ్యానము. సుదర్శనదాసు రచితము. |
| 0-8-0 | కర్ణ చరిత్ర లేక కృష్ణజననం. డిటో |



శ్రీ

# సారంగధర చరిత్రము.

శా॥ శ్రీకంజాసనవాసవాదివినుతా! శ్రీజాహ్నవీమస్తకా!
శ్రీకాళీముఖపద్మపద్మహితధాత్రీస్యందనా శంకరా!
శ్రీకంఠావర కావ్యకన్యకను సంప్రీతిన్సమర్పించితిన్
శ్రీకాశీపురవాస దీనిగొని దాక్షిణ్యాత్మ నన్గావుమా॥

## గురు స్తుతి.

కం॥ ధర కవితాగతిజూపిన
హరిభక్తుఁడు పక్కియన్వయాంభోధిసుధా
కరు డప్పలనరసయ్యన్
నిరతము గడు భక్తితోడ నేఁబ్రార్థింతున్॥

## కవివంశావళి.

సీ॥ శ్రీసింహగిరికి పశ్చిమభాగమున మహోత్తుంగమైతనరారు తుం
గలాము । నందు నాగలగోత్రమందు బుట్టిన తాతయాఖ్యుండు నా
తాత యతనిసూను । డాదినారాయణాహ్వయుడు నాతండ్రి యాతి
నిపత్ని యచ్చమ్మ ధన్య నాదు । తల్లి యామెనుగన్న కొల్లియప్ప
న్నాభిధానుండు నాదు మాతామహుండు॥

గీ॥ వానిసుతుడు వెంకప్ప నామేనమామ
అమలగుణుడైన శ్రీపక్కి యప్పనార
సింహనామధేయుని ప్రీతి శిష్యుడైన
మద్ది రంగనాయకుడంద్రు పెద్దలునను॥

గీ॥ నలుదెసల బారు బెంగాలు నాగపూరు
రెయిలులో డ్రైవరించాడ్జి నయముమీఱ
నలుపుమని నియమింప సజ్జనులదయను
నేర్పుకొలది దానిని నెరవేర్చుచుంటి ॥

—• కథా ప్రారంభము •—

కల్యాణి - రూపకము.

సారంగధరచరిత్ర సారము గనుగొనుడి వినుడి ॥సార॥
ధీరజనాళికిని మంచి - దారి జూప దగిన శ్రీ ॥సార॥
నవరసభరితంబగుకధ - నయముగవినువారికిది సుధ
భవరోగములకుమందు - భావజారిభక్తులకు విందు ॥సార॥
రంగనాయకుని బోచిన - రజితాద్రినిలయుని
జంగభూషణుని కరుణయు - శమునార్జించిన శ్రీ ॥సార॥

తో॥ హరహరపురహరస్మరహరశంకర యనిమదిలో వేడండీ
పరమహర్షమున శాశ్వతానంద పదవిని వేగగొనుండీ
భూలోకంబున గోదావరియను పుణ్యనదీతీరమున
లాలిత్యంబగు లచ్చికినిరవగు రాజమహేంద్రవరమున
ఆనగరంబును రాజనరేంద్రుం డమితసద్గుణాన్వితుడు
జానుమీఱబరిపాలింపుచుండె సజ్జనసమాజహితుడు
అతనిభార్య శ్రీరత్నాంగిదేవి సుతుడు సారంగధరుడు
నుతియింపందగినయశోధనుడు పతితులకుదండధరుడు ॥

ఉ॥ ఆమహనీయుపత్ని దరి నారుగుణంబులెసంగు కాంతికిన్
కాముని భార్య వల్లభుని కాశివాసునిగాగ నెంచు నా
భామిని బిడలగ్గనిన బట్టల నన్నము దానమిచ్చు బల్
ప్రేమను సోమశేఖరుని సేరుదలంచుచునుండు నెప్పుడున్ ॥

వ॥ ఇట్లుండ సారంగధరునకు బెండ్లిజేయందలంచి సభ్యులను రాజనరేంద్రుం డవలోకించి ॥

ఉ॥ ఓసుగుణాత్ములార! ముదమొప్పగజెప్పెద నాలకింపుడీ
వాసిగ నాదుపట్టికి వివాహముచేయగ నేదలంచితి
న్నాసుతురూపము స్ఫుటమునన్దగ వ్రాయుడనంగ నప్పుడే
వ్రాసిరి తత్పటంబును సభాసదులందరు మెచ్చునట్లుగన్ ॥

వ॥ ఆపటమ్మును రాజనరేంద్రుండుచూచి చాపర్ల రావించి సమస్త దేశాధిశులకుంజూపి నానూనునకు దగిన కన్యక నరసిరండన వారలాపటమును గైకొని పాండ్యదేశాధిపతియగు చిత్రాంగదునిబ్రహ్మాలకేగ నారాజకుంజరుం డాపటమునుగాంచి యిందుగల సుకుమారుండు మదీయాత్మజాతయగు చిత్రాంగికిం దగినవాడని యోచింపనప్పుడంతి దీనిందెలిసికొని పటముదెప్పించి కేలంబూని॥

బేహాగ్ - ఆదితాళము.

నాకు నీకు జోడు తగు నామోహనాంగ ॥నాకు॥
మాకుమార స - మానసుందరాంగ ॥నాకు॥
నవ్వుమొగమువాడ - నావన్నెకాడ
పువ్వులవిలుకాని పోగుంగూడ ॥నాకు॥
నూగునూగుమీసంబు - నునుపగ్గువకుంబు
బాగైననీమొగంబు - పద్మసమంబు ॥నాకు॥
క్షితిరంగదాసునేలు - శితికంఠుండు నీ
సతిగ జేయునో లేదో - స్మరదమనుండు ॥నాకు॥

వ॥ చిత్రాంగి మనోభీష్టము దండ్రితో దెలుప నాతండంగీకరించి తన కుమారికంబోలు పటమొకటి వ్రాయించి వచ్చిన బ్రాహ్మణులచేతికి నీయ నారలాపటము రాజనరేంద్రునికి సమర్పించిన నాతండవలోకించి మోహాపరవశుండె ॥

మంజరి.

తనకుమారునకు జేయందలచిన తరుణినిదాగొనుటకును
మనమున నెంచి పురోహితులనడిగె ఘనలగ్నముగనుటకును

తగినలగ్నమును జూచినద్విజులకు తనఖడ్గమునిచ్చుటకుఁ
సాగనుగభూపతి నిశ్చయించె నాసుదతినిగొని తెచ్చుటకుఁ ॥

వ॥ అంత నావిప్రులే తెంచి చిత్రాంగిజనకునకు నీసంగతి విన్నవింప స
తం డానందించి ॥

చ॥ ఘనుడగుపాండ్యభూవిభుడు కన్నన లగ్నము నిర్ణయించి యా
దినమున బెండ్లి జేసె గనుధీరత బుత్రికి మేటిక త్రికిఁ
తనివినిబొందునట్లు సరదారులకు న్బహుమానమిచ్చె నా
తనయను పెండ్లిపెద్దలవితానముతోడను బంపె వేడుకఁ ॥

వ॥ అంత నారాజనరేంద్రుండు హెనలేని సంతోషమ్మున నొకసుదినంబున
చిత్రాంగిని జేరందీసి తన యభిలాష నెఱింగింప నాపడంతి చింతాభ
రస్వాంతయై మనమ్మున ॥

మంజరి.

కంతునిబోలిన సుందరపురుషుని గానదైతి పరమేశా!
వింతకురూపాన్వితుడైనట్టి వృద్ధుని గంటి నుమేశా!
అని తలవంచి విచారింపగనా యవనిపతి బ్రతిమాలి
మనమలరగలాలించి పడంతిని స్మరరంగంబున నేలి ॥

వ॥ ఈవిధంబున గొంతకాలము చిత్రాంగితో సుఖింపుచు మృగయావి
నోదార్థమై రాజనరేంద్రుం డరణ్యభూముల జేరె ॥

కల్యాణి - ఆదితాళము.

కొట్టిసన్మృగముల మట్టినాబ్బముల బట్టిన్బులులను చిట్టెడలఁ
మెట్టలబోలెడు లొట్టియలఁ బట్టిసన్మరి జట్టులబడిగట్టిక్ ॥కొ॥
లేళ్ళనుమన్నుల గుళ్ళనుమార్బిలజేసెఁ బాకాతుషాకులతోఁ
భల్లంబులతో బడ నేసెను పెనుముళ్ళడొంకలను దాటెడుదుప్పుల ॥కొ॥
వేసఁ శరముల కేసరితతిపై ఘోషింపుచుగర్జోలువడఁ
సిగ శ్రీమద్ది రంగనాయక దాసావనుడౌ యీశునిమరువక ॥కొ॥

వ॥ ఈగతి రాజనరేంద్రుం డరణ్యంబున వేటలాడుచుండ నగరి యందుగల చిత్రాంగి దాసినవలోకించి మాతండ్రికినంపిన పట మునంగలరూప మీనృపాలునియం దమరియుండ లేదు కార ణమేమి యట్టి సుందరపురుషుం డీకోటలో నున్నాడా? లేదా?

కాఫి - ఆదితాళము.

అలినీలవేణీ ! అతఁడెవ్వఁడోగాని ॥అలి॥
తెలుపవే నాకు - వలదుపరాకు ॥అలి॥
పటమునుజూచినాతండ్రి క - పటమునుబాసి - యుపయామము
దటుకున జేసిముదమున ని-చ్చటికిబంప దటమటయ్యె నాబ్రతుకు ॥అలి॥
కంద, ర్పునిమించినపురుషుని - ముందు, గంటినినాజోడత
డెందు, నున్నాఁడో తెలియదు - విందు, జెప్పుముగనుగొందు ॥నలి॥

వ॥ ఇట్లనుగ నాచిత్రాంగిని దాసి జూచి.

చ॥ వినుము నృపుండు పుత్రునకు పెండిలినేయదలంచి వానిసొం
పును పటమందునిల్పి యదిభూసురవర్యులచేతికిచ్చి తా
బనిచిన తత్పటమ్ముఁగని పాండ్యపురాధిపుడెన్ని నిన్ను నా
తనికినొసంగనీకొసి ముదమ్మున నీపటమంప దాని వృ
ద్ధనరవిభుండుజూచి కనుదమ్ములనద్ది విమోహచిత్తుడై ॥

వ॥ మాయజేసి నిన్నాతండు బరిగ్రహించినాడన తద్వచనంబులు చి త్రాంగి విని కనుగొనల నీటిబిందువుల నొలుపుచు,

ఆనందభైరవి - రూపకము.

మోసమాయెనమ్మ నా - మోహనాంగునిజూపు ముద్దుగుమ్మ ॥మో॥
వాసిగకుమారునకు వి - వాహముచేయగదలంచి
యాసతో రాజు నన్ను బెండ్లి - యాడెను, జతవీడెను, వ్రతమూడెను,
ధృతివీడెను. ॥మో॥
దయతో హితుడై న సారంగ - ధరుని గలుపవే కురంగ

నయున విడువదాన రంగ - నాయకునేడ, భాయనిమ్మడు, పూజనమె, వ్వాడు నేవిడ ॥మో॥

వ॥ ఈగతి చిత్రాంగి దుఃఖసాగరమున మునింగియుండ సారంగధరుం డలంకరించుకొని నెచ్చెలికాండ్రయొద్దకుం జని.

కల్యాణి - త్రిశ్రగతి.

ఆడుకొందమురండు - తెల్లజోడుపావురములదెండు ॥ఆడు॥
వేడుకమీఱగనెగర - వేసిమోడుగెల్పు
జూడవలయుమనము - నేడుబాలులారా! ॥ఆడు॥
నగరిజనులుజూడ గగ - నమునకు బావురముల
నెగరవేయుచు గెలుదట్టి - సొగసుగగుమిగూడి న్నే ॥డాడు॥
రంగనాయకపాలుర భూ - రధుధృతకపాలుర
అంగజమదవిఫాలుర - మంగళాంగుమదినెంచు ॥వాడు॥

మంజరి.

వాసిగరాజకుమారుడు బాలురు - వరుసగనాడగజూచి
దాసిచెప్పెనో భాసురాంగి ! యా - ధన్యునిగనవేలేచి

వ॥ ఇట్లు దెల్ప నాచిత్రాంగి చక్కగ నలంకరించుకొని.

ఉ॥ అంత నెలంత సంతసిలి యద్దపుమేడలమీదికేగి ధీ
మంతుడు రాజనందనుడు మంత్రులు నాడగజూచి మూర్ఛలెర
జింత మునింగియున్న దనచేడెలు సేవలుజేయుబూని పూ
బంతులు మంచియత్తరవు బాగుగబూసిరి దేహమంతయుణ్॥

గీ॥ కొంతసేపటి కాకాంత వితమూర్ఛ
దేలి స్మరబాణపితతికి దాళలేక
రంగుగా నాటలాడు సారంగధరుని
చక్కదనమును వర్ణింపసాగె నప్పుడు॥

నాటకురంజి - త్రిశ్రగతి.

చక్కనిచిన్నవాడె - సైగజేయుచున్నాడె ॥చక్క॥
ప్రక్కకు జేరరాడె - పంతగించియున్నాడె ॥చక్క॥
జవ్వనీ! నాపైసుమ - శరుడుచలపట్టి
పువ్వుటమ్ములబూని - రివ్వున వేయుచుండ
తరుణీ! సుమశరుని, బారికిసైపగలేనె ॥చక్క॥
మోహముపూర్ణచంద్రుని - బోలియున్నదిచూడు
కామునిమించినట్టి - కడురూపవంతుడు
సేమముగ రంగదాసుణ - నిరతము నేలినట్టి
శ్రీమహాకాళీధవుడు పర - శివుడు జతగూర్ప మరువకు ॥చక్క॥

గీ॥ రాజసతి మేడనుండి సారంగధరుని
యందమునుజూచి మది గొనియాడుచుండు
నంతభూజానిసూను డత్యంతసంత
సమున నొకపావురమును హస్తమునబెట్టి॥

సింధుకమాచి - ఆదితాళము.

ఎగిరవేసెను వేడుకమీఱగ - జగతిపైపావురమును సారంగధరుడు॥ఎ॥
ఎగసిపారెనది యేబదికోసులు - గగనమునగల మేఘముచాటునబడె
మగువచిత్రాంగి మేడపైనుండి - మగపావురమును జూపించినంత
సొగసుమేడపైవాలెను - బాలురుజూడగ
వగలాడగ పగలోడగను ॥వెగ॥
వాలినపక్షిని వనితపట్టుకొని - వాలాయముగ లోనికిబోవగ
బాలులంత చిత్రాంగిమేడపై - బక్షివాలెనని యనుకొనుచుండగ
బాళిమీఱసారంగధరుడువిని - బయలుదేరె హాయల్లుమీఱ
డగెమనసార ॥ ఎగిర॥

వ॥ అంత సారంగధరుడు పినతల్లిదరినున్న పావురముం దే నిశ్చయిం
చిన మంత్రికుమారుం జాతనిగాంచి.

ఝంఝూటి - త్రిశ్రగతి.

వినురాజకుమార ! రూప - విజితమార ! సుకుమారా ! ॥విను॥
చనువునదెల్పెద వినుమిప్రొద్దు - పినతల్లిమేడకు నరుగవద్దు॥ విను॥
నీకు పెండ్లిజేయదలంచి - నీరూపమును వ్రాయించి
నీకన్నతండ్రిసంతసించి - నిఖిలదేశములకంపించి
ప్రాకటముగనీకుదగిన - పడతిరూపమునుదెప్పించి
జోకమీర తామోహించి - శుభలగ్నము నిర్ణయించి
కోకిలవాణినిసత్వర - కోర్కెమీఱదెప్పించి
లోకనిందలకు వెరువక - లోలాక్షినిబెండ్లియాడె ॥విను॥
రాజులేని కాలమ్మున - రాణివాసమునకుబోరాదు
రాజకాంతనినుమోహించి - రతిసలుపకున్నవిడువ
దాజలజాక్షినిగూడకున్న - నమితశిక్షనీకుదప్పదు
రాజితముగ నొకనిబాపు - రమణిచెంతకు మాటపోదు
తేజోజితభాస్కర ! చెప్పితినని కోపముంచరాదు
భ్రాజితముగరంగదాసు - పూజించెడి హరచరణము
లాన యీజగాన సుజ్ఞాన జ్ఞాన జనాధీన ॥విను॥

ఉ॥ కానని మేడి పుష్పమును గానగవచ్చును నేవిధంబునన్ ।
జానుగదెల్లకాకినిల జక్కగ జూడగవచ్చు నంబుధిన్ ।
మీనములున్ననాయడుగు నేర్పున జూడగవచ్చుగామినీ ।
మానసముంగనుంగొన రమాపతికైన దరంబెధాత్రిలోన్ ॥

వ॥ ఇట్లు మంత్రికుమారుండు జెప్ప సారంగధరుండలుకంగొని

కమాచి—ఆదితాళము.

ఇప్పుడు జెప్పితివి మరెప్పుడు జెప్పకుమా ఓర్మంత్రికుమార ॥ యి ॥
చెప్పరాని మాటలు నాయెదుట - జెప్పకుమా తప్పు సుమా ॥ యి ॥
కాన్నతీ ! నను జూచి తల్లియెందుకు మోహించునురా వసుధలో
ధర్మమార్గమ్ము ఎఱిఁగిపి నీకు - దయ్యముపట్టినదిరో యిట్ల య

ధర్మపు మాటల నాడుటకు నెటుల - ధైర్యము పుట్టెనురా తంత్రపు
మర్మము నేగనుగొంటిని వింటిని - మెచ్చించితి వినరా లేకున్ననీ
చర్మము తునుకలుగా గోయిం - చెకమానుదునటరా రంగనాయకు
నిర్మల చిత్తంబున నేలిన గజ - చర్మాంబరుని మదిదలచుచు స
త్కర్మమాచరించు సవతి తల్లిని - గని పత్నిని యాచించి దెచ్చెద ॥ ని॥

గీ॥ ఆత్మబుద్ధి వలన నతిసుఖంబులు గల్గు।
గురుని బుద్ధి వలన గూడు ముక్తి।
పరుల బుద్ధి వలన వచ్చును నాశంబు।
స్త్రీల బుద్ధి వలన జేటు వచ్చు।

మంజరి.

నా యిష్టముతోడ తల్లినగరికి - బోయెద మంత్రికుమార।
మాయలేల పత్నిని దెచ్చెద నిక - మనోసంభవాకార।

వ॥ ఇట్లని సవతితల్లి మేడకుంజన నా చిత్రాంగి మొలకనగవున చె
చ్చెరవచ్చి సారంగధరుని కేలువట్టుకొని.

కరహరప్రియ—ఆదితాళము.

చూడ నేటికి దయగల్గెన నన్ ॥ జూడ ॥
వేడుకమీఱ మన యిద్దరికి నా బ్రహ్మ
జోడుగూర్చ బుట్టించె - జోకతోడ నిలలోనన్ ॥ జూడ ॥
మన్మథునాలమున వే - మరు నిన్ను గలియని
జన్మము వృథాయని - యోచనజేసి యిచటికినన్ ॥ జూడ ॥
అర్కతేజ నాపై కడుదయారసముంచి నా మీద
కోర్కెదీర్చు నినుగోరితి వేసారితినన్ ॥ జూడ ॥
ధరణిరంగనాయక - దాసావనుని కృపచే
సరసుడ నిన్ను జూడ - సంతోషమాయె నేడు నన్ ॥ జూడ ॥

వ॥ ఇట్లన సారంగధరుండు.

మంజరి.

అమ్మా! సమ్మతితోడుత పావుర-మిమ్మాపంపగదమ్మ।
నెమ్మదినిన్గూడుమనుట నీకిది - నీతిగాదు పిన్నమ్మ।

వ॥ ఇట్లన జిత్రాంగి సుకుమారా!

చ॥ వినుమిక నీదు పావురపు పిట్టను బట్టి మరుందు దాచెగా।
వున నటుపొమ్ము తన్నగరిపోలిక రెండగు కచ్ఛపంబులుం
డును వడివాటిదాట ననటుల్దుగకంబములుండు వాటిపై।
ఘనసిజునిల్లెసంగను గని మానుగ యుద్ధము జేసి యోడగం।
తునికర కందుకద్వయిని దోకొను పావురమిచ్చ్చి వేడుకన్॥

వ॥ ఇట్లని యభిప్రాయము వెల్లడింప అమ్మా! ధర్మాధర్మ మాలోచింపకిట్టి చెడుగుపనికి యొడంబడుట చెల్లునా యన చిత్రాంగి సారంగధరునిజూచి మార్దసుందరా!

ఉ॥ అమ్మనుగాను నీకు దగునాలిననమ్ముము కమ్మవిల్తున।
త్రమ్ములకోర్వలేను సుమసాయక సన్నిభ! సుందరాంగ! నా
కమ్మని మోవినొక్కి నను గౌగిట జేర్చి మర్త్యలోకసౌ।
ఖ్యమ్ములుమిమ్ము రాజతనయా! కడుపుణ్యముగల్గు నీ కిలన్ ॥

వ॥ ఈ మాటలు విని సారంగధరుడు.

శహాన—త్రిశ్రగతి.

తప్పుమాటలాడకు పినతల్లి సద్గుణమతల్లి ॥ తప్పు ॥
చప్పున పావురము నిచ్చి - చయ్యన ననుబంపదలపుము ॥ తప్పు ॥
తండ్రి నగరమందు లేదు - తాను విన్న గల్గు నీడు।
కంద్రాదినాపైగొను నేడు - ఘనముగ జేతువందనము ॥ తప్పు ॥
ఈసువాసు నాదారి - జూడకుండ జేయు మరి
కూడని మాటలను నారీ! - కూర్చకు నీ మనసు మార్చకు ॥ తప్పు ॥

తప్పకరంగనాయక - దానునేలు గౌరీనాయకు
నప్పణమును మీరిననది - యంటక మైజంపు నిజంబిక ॥ తప్ప ॥

వ॥ అనవిని సారంగధరునితో జిత్రాంగి.

సీ॥ చుక్కలరాయండు జక్కనిదారతో సంతోషమున రతిసలుపలేదె।
అన్న పెండ్లాం బని యనకసుగ్రీవుండు దారకౌగిటలోన జేరలేదె।
అమరాధిపతి కోడిగ్రాయె పంచలోపొంచి కూసి గౌతమసతిం గూడలేదె।
కన్నకూతునిగోడ కమలసంభవుడు నక్కుసుమాస్త్రుపోరిలో గూడలేదె ॥

గీ॥ దేవతలకున్న తప్పులు దెలియరాదె
ఇట్టితప్పులనెంచుట యొగ్గుగాదె
సారిపుమీఱి నీకౌఱకు నన్పంపలేదె
శీఘ్రమున బ్రతిమాలిన సిగ్గుగాదె ॥

వ॥ ఇట్లన సారంగధరుండు సవతితల్లిని గనుంగొని.

గీ॥ మేటికొండకు చిరుమెట్టసాటియగునె
హంసతో కొంగసరిబోలనగునెతల్లి
నుసమువారితో సరియనే ఘనముగాదు
పాపురమునిమ్ము పదివేల వందనములు ॥

మంజరి.

ఎన్ని జెప్పినవినకయున్న యా - యన్నువముందుగ నడిచి
కన్నచేదామరగొని చెప్పం - గడగె నలసిగ్గువిడిచి ॥

చిత్రాంగి సారంగధరుల సంవాదము,

బేహాగ్ - ఆదితాళము.

చిత్రా—మోహాముదీర్చు మోహానాంగ ॥ మో ॥
దేహావిజిత శుకవాహా! మానితసంప
ద్గేహా! నామునసిజ - దాహాముదీర్చు ॥ మో ॥

సార—విడిచిపెట్టవె కన్నతల్లి ॥ విడి ॥
దుడుకుతనమ దేం - దుకు మానుము చెడు
నడతమాని చిదా - నంద మొందుము ॥ విడి ॥

చిత్రా—అందకాడా ని - న్నాశ్రయించితి మహా
నందముతో నన్ను - బొందవేమిర ॥ మో ॥

సార—కుమారుడనునీకు - జుమా నన్గోరుట ధ
ర్మమమామదసామజ - సమానగమన ॥ విడి ॥

చిత్రా—వడిగనునినుగూడక విడువను - వచ్చెడియపనిందకు జడువను
కడువడినను, గాగిటగొను, - తడవేలను విడజాలను ॥ మో ॥

సార—పట్టక మొలదట్టిని విడువుము - పరమార్థము సారసినడువుము
పట్టుదల, విడుమానల - నెట్టనపావురమిచ్చి ॥ విడి ॥

వ॥ అని చిత్రాంగినివిడిపించుకొని పోవుచున్న కుమారునిజూచి తల
యూచి.

ఉ॥ నాయెదలోని కోరికలనాశముజేసితివౌర పార్వతీ
నాయకుపాదమాన నరనాథునితోడ వచించి నీమొదల్
పాయలుగాగ జేయుదును పల్కులనమ్మము కొమ్మ నింతదుః
ఖాయతశోయధిన్విడు మనట్టి ఫలంబు లభింపకుండునే ॥

వ॥ ఈరీతిని ప్రతినగావించి యొడలురక్కుకొని క్రొమ్ముడివిప్పి మలినప
టముమదాల్చి కన్నుంగవ నశ్రుకణంబులొలుపుచు కపటచిత్తయై
యుండె. పినతల్లిచేతినుంచి తప్పించుకొనిన సారంగధరుండు.

మంజరి.

దయనింపుము దయనింపుము నింపు - తనయునిపై దయనింపు
నయముమాని మొలదట్టిచించితివి - న్యాయమేమొ యోచింపు ॥

పంచచామరము.

సుబుద్ధిచెప్పినట్టిమాట సుంతయైన నెన్నకే
యబద్ధమంచుబోవతల్లి హాస్యమేల యాడెనో
కుబుద్ధి మాటలాలకించి కుంభినీశు డాగ్రహ
ప్రబద్ధుడౌచు నెట్టిశిక్షపట్టుగా విధించునో ॥

వ॥ ఇట్లు సారంగధరుడు వితర్కింపుచు నెచ్చెలికాండ్రంగూడి నిజమందిరమునకుం జనియె. రాజనరేంద్రుడు కాంతారమునంగల జంతుసంతానము నంతపుచ్చివచ్చి చిత్రాంగిమేడకేతెంచి చింతాభరస్వాంతయైయున్న దానినవలోకించి.

కల్యాణి - త్రిపుట.

నాప్రాణధనమా! నాతో మాటాడవేమె ॥ నా ॥
యీప్రొద్దునాపై నింతకోపమేమి నా ॥ ప్రా ॥
నిద్దురబోవుటకుముందు కౌగలించి ముద్దునిచ్చి
ముద్దుదీసికొని మరిసుద్దులను దెల్పి పరస్త్రీలబొంద
వద్దు సుమాయనిబోధజేసి మంచి
బుద్ధులను జెప్పుచుందుదానవే యీ
ప్రొద్దునాసరి హాస్యాలో లేవు ముద్దుగా ॥ నాప్రా ॥
రంగదాసావనుపాదమానయుత
రాంగనలగూడలేదు వినుము కు
రంగనయన నీనోటినుంచి మంచి
బంగారపుపలుకురానిచ్చి మదిపొంగజేయు స్మరశాస్త్రపద్మ
భృంగమా! నాతోరంగమా? కుచోత్తుంగమ ॥ నాప్రా ॥

గీ॥ మాటలాడకయున్న నామగువపొంత
వసుమతీశుండు జేరుచు ముసుగునంత
దీయగా గాయములనొప్పె కాయమంత
జూచి యిట్లనసాగె రాచూలి వింత॥

మంజరి.

ఈవడువునను ండుటకు కారణంబేమియో జలజనేత్రి
సావధానముగ దెల్పుము నేడు చామీకరసమగాత్రి
పరపురుషు లెవ్వరైన నిన్ను చెఱబట్టిరా? దెల్పు నేడు
కరవాలమ్మున వానికంఠమున్ ఖండింతు నిపుడుచూడు॥
వ॥ ఇట్లన విని చిత్రాంగి మనోహరునితో.

ఫీల్వా - త్రిశ్రగతి.

అంటకుమా నన్నంటకుమా రాజ ॥అంట॥
కొంటెపనులు నీకొమరుడుగావించినా ॥డంట॥
శయ్యపైని నేను । శయనించియుండ
చయ్యనవచ్చినా । చన్నవబట్టినా ॥డంట॥
అంతట నే లేచి । వింతగనుజూచి
చింత చేనుండ నా । చెక్కిలినొక్కినా ॥డంట॥
కుసుమాస్త్రరణమున । కూడుదమని గ
ట్టిసివ లెబట్టుక । కౌగలింపసాగె ॥నంట॥
సార్వభౌమా! రంగదాసవినుతునియాన
కూరిమిగలనీ । కోడలనై తి న ॥న్నంట॥

ఉ॥ నాకసమానమధ్య నరనాథునితో దెలుపంగ నుగ్రుడై
తోకనుద్రొక్కు పాముగతి త్రుళ్ళి చటాలునవచ్చి సభ్యులన్
జోకనుజూచి శాస్త్రపరిశోధన జేయుడు పిన్నతల్లి కేల్
ఛేకొనువారలే కఠినశిక్షలుబొందుటకర్హు లుర్విలోన్॥

వ॥ ఇట్లడుగ శాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రమూరసి నరేంద్రా!

కం॥ ధరలో తలి కేల్పట్టిన
దురితాత్ము నరణ్యమునకు దోకొనిచని క

త్కరచరణమ్ము లదయులై
నఱుకంగావలయుననగ నరవిభుడనియెన్॥

వ॥ తలవరులారా! సారంగధరుని కారడవికి దీసికొనిపోయి కాలుసేతులు ఖండించిరందు పొండన బండితులు మిక్కిలి బొక్కి రాజశేఖరా! ముందువెనుక నాలోచింపక యిట్టి కఠినశిక్షవిధించు టుచితము గాదు. దయనుంచి పుత్రకుని రక్షింపుము. లేకున్న చిలుకసామ్య మగును. ముందుకు మీరు చాల విచారింప. నవకాశమగు నన నృపతి పండితులంగని.

గీ॥ విసువుపుట్టజెప్పెదరిట్లు వెఱ్ఱిబట్టి
నట్లు మీమాటలకు నెదురాడలేను
గాని తనయునిపైతప్పు కనులముందు
బట్టబయలాయె శిక్షబోగొట్టజాల॥

వ॥ ఇట్లన విద్వాంసులూరకుండి రంత దాసీజనంబులేగి రత్నాంగితో.

నవరోజు - ఆదితాళము.

వింటివా రత్నాంగిదేవీ! । వింతలే మొగలినవి ॥వింటి॥
కొంటుచిత్రాంగి రాజుతో । కొమరునిపైని
తప్పులుబన్ని । చెప్పెనుకొన్ని ॥వింటి॥
తానునొంటినుండని । తనయుడు తనదండజేరి
జానుమీఱగలిసెనంచు । జనపతితో జెప్ప నతడు
కానికోపమునసభలో । గానకు గడుత్వరతో నీ
సూనునిదోడ్కొనిపోయి। యటగల। శుభ్రమైన బండరాయిపై
మానుగ కాళ్ళునుచేతులునరుకు । మని యాజ్ఞాపించెనునీ
సూనుడువిని విలపించెను నీవు
ధ్యానించుము త్వరగరంగనాయక। దాసావనుడైన శంకరుడు నీ
శిక్షణము దొలగింపగలండీ తక్షణము చిత్రాంగికి దగదీ
లక్షణము॥ వింటి॥

మంజరి.

ఈసంగతివిని మూర్ఛంగొనెనాయింతిపుత్రుడాయనుచు
నాసఖియలు దుఃఖాబ్ధిమునింగిరియపుడొకరినొకరుగనుచు
కొంతసేపటికి మూర్ఛదెలిసికొనిదంతిగమన వేలేచి
చింతనుగొని పుత్రునికై యేడ్చుచు జేడియ చెలియలజూచి॥

నాదనామక్రియ-త్రిశ్రగతి.

ఏమి యోచన సఖియలార! వేగజెప్పరే ॥యే॥
రామచిలుకవలె సవతి ప్రభున। కేమిజెప్పెనో కుమతి
ప్రేమమీఱ పల్కులాలకించె, తప్పులెంచె, కొంపముంచె ॥నే॥
నలువురు నీమాటవినిన। నగరె యెదలొనగొనిన
తలపగానిదియన్యాయము సదుపాయమగుయుపాయ ॥మేమి॥
సుతునినొక్కనిముసమైన। జూడకుండగలనాచాన
శ్రీతిరంగదాసాదనుమనము। నందీదినము వేడ ఘనము ॥యేమి॥

వ॥ ఈరీతి బలవింపుచు రత్నాంగి రాజసభకేగి రాజనరేంద్రుని యడుగుదమ్ములపయి నొరగి.

పీల్వా - యేకతాళము.

మనవిని విను ప్రాణనాథ! నాదా ॥ మన ॥
జనగణామోద - జగతిమర్యాద ॥ మన ॥
ఈలాగునజేయుట మీకిదిపీలా - మీమాటలు నలువురు
నాలకించిన నవ్వుదురీవేళ - ప్రేమనుగంటిమి మన
బాల, సుతునెడ కోపముమనకేల - పాలుమాలకుము కృ
పాల వాలజాలిమేల భూపాల ॥ మన ॥
సుతుపై నేరములు సవతిగల్పించి యీ
గతిమీతో జెప్పెను మీమతిలోనుంచకుము
సతతమురంగనాయక దాసపాలుడు జాగుసేయక

హితవుగనిన్ను బాయకబ్రోచు దురితముగ్గొనకు నాయక
హిత! బిరాన గనికరాన వేరానన || మన ||

వ|| ఇట్లు ప్రార్థింప నేలమగండవలోకించి.

మంజరి.

ఏలజెప్పెదవు చాలు చాలు నా - కెరుక యన్ని సంగతులు
చాల కష్టపడి నడిచివచ్చితివి - చాలింపుము నీ స్తుతులు

నాటకురంజి - ఆదితాళము.

నామనోనాయకీ! నాతియమాయకీ
సోమసఖీ సఖీ! - సుందరముఖీ! సఖీ! || నామ ||
తినయుని నేరము లే - దనుటయన్యాయము
ఘనకరములు కోళ్ళు - ఖండింతు నిజము
వనజనయనసభలో నీన్యాయము - నాసిగిదీర్చును పండితచయము
గనుకను నేనియమించితి చెలి నా
రణగామినీ! వర కామినిని! ఘనభామినీ! || నామ ||
నిచ్చలింకేమి పని నీనికామముమునకు నడుపుము
నీటుగి రంగనాయకుని రక్షించెదు శంకరుని
ధ్యానించుము నీమదిని ప్రియజానిదయబూని
మొరనాలకించు త్రిశూలపాణి పట్టపురాణీ! చట్టునమానిని! || నామ ||

చ|| ఇటువలెరాజు దానుడున నింతి విచారముతోడ బోయెన
చ్చటితలవన్లు కోపమునచయ్యన రాజకుమారుజూచి హా
కటకట యెంతపాప మొడిగట్టితివంచును గట్టివేసిరి
ద్భటవరులుగ్రరూపులయి బాలునిగొని వచ్చుచుండగన్ ||

వ|| అంత సారంగధరుండు మనంబున.

ఝంఝూటి - ఆదితాళము.

శంభో స్మరహార పురహారదేవా! హార హార || శంభో ||
అంభోజాసన తాపసి - జంభారిసేవిత భావిత || శంభో ||

నీపాదములను నెరనమ్మితి కోపగించకుమోశివ నీ
పాపద నాకుగలిగినయాప - దను దొలగించిన నిను
రేపగలు నే నేపా - రగదలతును పాలించుము పశుప
తీ! పావనకృపాకలాప - తాపసనుదీపగిరిచాప ॥ శంభో ॥

గీ॥ పరమశివుని ధ్యానించెడు బాలునపుడు
విడువకొగిబట్టి తెచ్చి రావేళ సభకు
తానెలుంగెత్తి యేడ్చుచు దండ్రికాళ్ళు
బట్టి విడువకయున్న జేడట్టె జూచి ॥

ఆనందభైరవి - ఆదితాళము.

ఎంతటిపని జేసినావుర సుతసముడ సారంగధరా! ॥ యెం ॥
పాపమనక యే నీపినతల్లిని - పాపపుపనులకై
పట్టినట్టి దుష్ట చేష్ట ॥ యెం ॥
నిన్ను జూడరాదు - నెగడయీవాదు యెన్నటికి
బోదు యింక కీర్తి రాదు రాదు ॥ యెం ॥
పుత్రుడవై బుట్టి శత్రుడవైతివి ధరిత్రి
పాపిచండాలుడా బడవా జడవా? ॥ యెం ॥

వ॥ ఇట్లనగా సారంగధరుండు తండ్రిసవలోకించి

ఆనందభైరవి - ఆదితాళము.

ఓ నను గన్న జనకా! మానుముకినుక ॥ యో ॥
నూనినిపైతెప్పించి కోపము జూపదగునా?
భూప సుగుణగణధన ॥ యో ॥
పట్టినేరములుగల్పించిన జెవిబెట్టినీవు నను
బట్టితెమ్మనిన - జట్టునముష్కరులగు యీజెట్టి
ల్బట్టి కొట్టి తిట్టి కట్టితెచ్చిరి ॥ యో ॥
నీపాదములసాక్షిగ జెప్పెద - నేపాపము నేనెరుగను మ్రొక్కెద
నాపినతల్లిది నేరము పినుగుణ - దీపకరుణ జూప వే నృపాధిప ॥ యో ॥

రద్దుజేయవద్దు నావిన్నపము - మద్దిరంగనాయకుని నేలిన తెలి
యెద్దునెక్కిన వానికెరుక యీ - ముద్దుగుమ్మ పద్దు లలుకవద్దు ॥యో॥

వ॥ ఈ తెరంగున రాజసూనుండు మొరలిడ భూతలాధిపుండంతయు లేని
కోపమ్మున భటులంగని.

మంజరి.

ఈపలుగాకి నరణ్యభూములకు - నిప్పుడె దోకొనిపోయి
సాపుగ కాళ్లుచేతులనుగొట్టి తక్షణమగు రుత్తెండోయి
వల్లెయనుచు నశ్వాలునిదోకొని తల్లిసన్నిధికిజనగ
తల్లిజూచి ఘొల్లుమనగ నిట్లనె తనయుండందరువినగ ॥

నాదనామక్రియ - ఆదితాళము.

దండముగొనుము నాతల్లి యడవికివెళ్ళి మీ
యండరాను మల్లి గుణకల్పవల్లి ॥ దండ ॥
నీకు నాకువింతే ఋణము భూలోకమందు
శోకమీరవినుము శోకంబుమనుము ॥ దండ ॥
పుడమిరంగదాసా ధారి - యడవి దారి
వడిగజూపించె నానారి - యిదే కడసారి ॥ దండ ॥

ద్విపద.

దండంబు పెట్టిన - తనయునిజూచి
సింధువేడుకతోడ - నిన్ను నాబ్రహ్మ
నాపాపగర్భంబు - ననునిన్ను వేసె
పాపడాయున్నడ - బాపులెవ్వరికి
జేసితినో నాదు - చిన్నికుమార
బాసి యేగతినుందు - బాలుడా! నిన్ను
యేమిసేయుదుతండ్రి - యెటులతాళుదును
భూమిని నిన్నన - పురహరపూజ
రాత్రియు బవలును - రహినొనర్చితిని

ధాత్రినినాకేల్ల - ధనధాన్యచయము
హాకుమారాయని - యవనిలోపలను
జోకతోనెవరిని - జూచినేబిలుతు
నాకెవరున్నారు - నాయనా! దిక్కు-
లోకంబులో పద్మ - లోచనయ్యంచు
భూజాంబువడినట్లు - పుత్రునియెదుట
భ్రాజితానననేల - వ్రాలిమూర్ఛిల్లె
ఘనమూర్ఛదేలియు - గ్రక్కునలేచి
తనయునిబట్టుక - తల్లియిట్లనియె

ముఖారి - ఆదితాళము.

ఏమిసేతు నేమిసేతు నీవేళనిన్నెట్లుబాతు ॥ నేమి ॥
ఏమిదుర్దశనీకబ్బె నా - ప్రేమకుమారా! ॥ యే ॥
మందులమారి నాసవతి యే - మందు నూరిరాచినదో
మందమతియయ్యెరాజ యే - మందు కుమారా! ॥ యే ॥
నిన్నుగనుగొన్నందుకు - నీచేతులతో పిడికెడు
మన్ను జేతువనుకొంటి నా - చిన్నకుమారా! ॥ యే ॥
రంగదాసావనుడు - రక్షించుననుకొంటి
ముంగలత్రోవజూపె నా - ముద్దుకుమారా! ॥ యే ॥

వ॥ ఇట్లు విలపించు తల్లినిగని.

మంజరి.

ఇలలోపలనుండువరకు బాయునె । యిడుమలెల్లరకు నూనా!
తొలగిపోవువారే ధన్యులుసుమ । విలసత్సుగుణోపేతా

వ॥ ఇట్లనేకహితోక్తులంజెప్పిన గొమరునిస్పైగల మాయంబాయలేక యేడ్చుచున్న రత్నాంగిని కింకరులుజూచి.

సీ॥ స్వస్థలంబువిడిచి సంత బజారులో
నిలిచి యిట్లు లేడ్వనీతిగాదు

మానవేంద్రుడిట్టి మాటలువిన్నంత
వచ్చు మాకుహాని వనజనయన ॥

వ॥ ఇటులబలుక రత్నాంగిదేవి గుండె రాయిజేసికొని చనియె. సారం
గధరుని భటు లదలించుచు.

ఆనందభైరవి - ఆదితాళము.

నడు నడుమయ్య కాననమునకు వడి ॥ నడు ॥
పుడమిఱేనికుమారా! - ప్రొద్దుబోవుచున్నది ॥ నడు ॥
నట్టడవియిచ్చటికి - నాలుగుమైళ్ళదారి
చట్టునదాటవలె - గుట్టలుమరియు పెనుపుట్టలు ॥ నడు ॥
ధరరంగనాయక - దాసపోషకభక్తా!
గురుతులుదెమ్మని సి - గురుడుగోరెను వేగ ॥ నడు ॥

గీ॥ ఇటుల బాలునిగొంపోయి భటులు ఘోర
విపినమునగల రాతిపై నృపకుమారు
నుంచి యాయుధంబులు నూరుచుండ నపుడ
నంగ వైరినివేడె సారంగధరుడు ॥

భైరవి - రూపకము.

సాంబశివా శివ శంకర హర హర ॥ సాంబ ॥
అంబుజాదబ్జ విభాకర కరుణాకర హర ॥ సాంబ ॥
దీనజనమందార రార - దేవ దేవ విజితమార
నేనీవాడను బ్రోవర - నేరములను దూరముగను
జేయుము నను వేడాయుము ॥ సాంబ ॥
కాలహరత్రిశూల ధర - గరళకంఠ కపాలకర
నీలలోహిత మహానట - నీనామమునెప్పుడు నే
మానకధ్యానము జేసెద ॥ సాంబ ॥
రంగనాయక దాసపోష - రజతపర్వత నివాస

గంగాధ రాంగజాత - భంగ శుభలింగ
శుభ్రాంగాబ్ధినిషంగ ॥ సాంబ ॥
వ॥ ఇట్లు ధ్యానించుచున్న సారంగధరుని తలవరులుజూచి.

కమాంచి - రూపకతాళము.

నరుకమాకు జేతులురావు - సాయనా! కమలదళనయన ॥ నరు ॥
ధరణివిభుడుగట్టుకొనె సీయ - ధర్మము బట్టిపాపిష్టికర్మము ॥ నరు ॥
కాళ్లుసేతులెవరివైన - ఖండించి యీదినమందున
కాళ్ళనుజూపెదము రాజు - కండ్లకు శోకమొదవిండ్లకు ॥ నరు ॥
ఎందుకునీతోడ మే - మీయడవికి వచ్చినాము
పొందుగసెలవిమ్ము రాజపుత్రుడా! మాపాలిమిత్రుడ ॥ నరు ॥

వ॥ అనిన సారంగధరుండు వారలంగని.

కం॥ నాతండ్రియాజ్ఞమీరిన
సీతారామ్ముండు మిమ్ము శిక్షించును నా
చేతులు గాళ్ళను గోయుడు
బాతకమనిమొంచనేల భటులారా! ॥

గీ॥ అనగవిని రాజభటులీమహాత్ముడెంత
సుగుణుడని కన్నుదోయినశ్రుపులురాల్చి
హృదయములు గట్టిపరచి యామృధునిబాగను
చున్న బాలుని కాళ్సేతులొనరనరికి ॥

కం॥ నరికిన చేతులు కాళ్లను
గురుతులుగొనిరాజభటులు గోల్గోలని యా
దరిగల డొంకలచాటున
కరిగిరి బాలకుని యంగలార్పులు వినుచున్

వ॥ అంత.

గీ॥ కాళ్లుసేతులు నరికినకేళ్ళనుండి
రక్తధారలు పార నశ క్రిగలిగి

సలుపు పోట్లకు నొప్పికి నిలువలేక
కేక వేయుచునిట్లు శోకింపసాగె ॥

అసావేరి మిశ్రగతి.

ఏమిసేయుదునింక యేలరావు నావంక
ప్రేమదప్పెనా? దైవమా! దైవమా! ॥ యే ॥
సోముడా! కడకంటిచూపైనను ముక్కంటి!
చూడరాదా? న్యాయమా శ్రేయమా ॥ యే ॥
కాళ్ళు సేతులు లేని - కష్టమొందితిని కరుణరాదా దైవమా
నిళ్ళుపోసియీ సీడనుండుమనెడి - తల్లిదండ్రులు లేరు దయనుంచు వేమారు
కాళ్ళుసేతులు సలుపులెక్కెను - గండుచీమలు గురువజొచ్చెను
రాళ్ళజడిమైన గురిపింపుము - ప్రాణములుబోవునటు ద్రుంచు
వ॥ ఇట్లు మొరలిడుచున్న సారంగధరునితో గగనవాణి.

వసంత - ఆదితాళము.

వినురాజనందనా! ॥ విను ॥
ఘనముగనీవుజేసిన పూర్వకర్మము అధర్మము
అమర్మము ॥ విను ॥
ధరహారుడొసగెను కౌశాంబిపురము ధవళచంద్ర
భూపతికి అరుదుగసిరిపురు మంత్రులుగలరు జయంత
సుమంతులుదనకు - పరగిసుమంతునకు న్యాభాగము
నరనాథుడప్పజెప్ప - నరిజయంతుడదిగని యోర్వ
లేక బానిసనుముదమొప్ప - త్వరగా తనయింటికి రా
వించి వలసిన ద్రవ్యమునిచ్చె మరువకుమాయొక మా
టజెప్పెద సుమంతునిగర్వము హెచ్చె ॥ విను ॥
శిరముపైకి నేత్రమ్ములువచ్చెను - చెలగిచంపయోచించు
మరువక వానిపావలు స్నపసతిమంచము క్రిందనుంచు ॥ విను ॥
అరుగుమనగ జని పావలుజేకొని - యాబానిసయింపొంద
పరులకు నగపడకుండగనుంచెను - పందిరిమంచముక్రింద ॥ విను ॥

ధరణీశుడురాగ వానికండ్లకు - తప్పకగనుబడి వడిగ
పురరాణీ! పాదుకలెవ్వారివని - భువనసుందరినడుగ ॥ విను ॥
తిరిగిజవాబీయకున్న కోపము - దెచ్చుక భోగముమాని
మరునాడుదయమ్మున సింహా - సనమందు రాజుగూర్చుని ॥ విను ॥
పరిచారకులనుబంపి పావలు - సభాస్థలికిని దెప్పించి
పరికించుడి పాదుకలెవ్వారివని - పండితజనములు గాంచ ॥ విను ॥
కరుణమాని తనపెద్దతలారి - కిరయుగమును జోడించె
నరనాథా! సుమంతపావలని - నయముగ దావినిపించె ॥ విను ॥
దరిజేసెను సుమంతునిజూచి - ధరణీధవుడిటు బలికె
సరిచేసితివిరా చాలమేలు - నీ-సద్దయారసములొలికె ॥ విను ॥
పరివీనిని నడురేయియందున - మధ్యారణ్యములోన .
కరములుకాళ్ళచు ఖండించుమని ఖడ్గముతోడ విరాన ॥ విను ॥
బిరబిరతలవరులా సుమంతుని - భీకరముగగొనిపోయి
తరిగిరితక్కర చరణయుగమ్మును - తల్లడిల్లవినవోయి ॥ విను ॥
నరహరినాపై కుట్రమొనర్చిన - నరుడీవిధమునను
చెరబడుగాకని ప్రాణమువిడిచెను - సురలందరువినగను ॥ విను ॥
అరయసుమంతుడు నీతండ్రి - మొబ్బట్టునునితల్లి
తరళాక్షి భువనసుందరి - చిత్రాంగి బానిసమల్లి ॥ విను ॥
స్థిరజయంతుడవు నీవుజేసినదే - యనుభవించినావు
విరివిగను రంగదాసవరుని - వేడు మాపదలురావు ॥ విను ॥

క॥ ఆకాశవాణి పలుకులు

ప్రాకటముగనాలకించి రాజకుమారుం
డే కాగ్రతనుండెను భట
లోకముచనె రాజుతో విలోలతదెల్పన్ ॥

వ॥ ఈసమాచారమటులుండ నత్తరి నొక్కవహానీంద్రుడరుదేర వాని సారంగధరుండుజూచి.

బేహాగ్ - త్రిశ్రగతి.

ఓమహా మానీశ్వరా! నమో నమో ॥ యో ॥
నమో నమో పామరుడను తామసుడను ప్రేమజూడుమ
యేమందుని శ్రమ నాలిఖితము ॥ యో ॥
కాళ్ళు నేతులు లేవు కరుణాకర! కరుణాకర !
కీళ్ళను నామోకాళ్ళనణచి కాళ్లనరికిరి నా
యొల్లుననిండియున్న విముళ్ళు యిమ్ము మంచినీళ్ళు ॥ యో ॥
నాకొరకై మిమ్ము బంపె నాప్రభు నాకష్టముదీర్చిన
రంగనాయకావనుడు మెచ్చు మోక్షమిచ్చు
పాపములు విచ్చు ॥ యో ॥

వ॥ అనిన మునీంద్రుండు.

ఝంఝూటి - ఆదితాళము.

జడువకు బాలుడ సద్గుణశీలుడ - జెచ్చెరనాగ్రహోమునకునడు ॥జడు॥
యొడలెల్లనుమారునిరూపంబుగ - నొనరింతును కపటమ్మువిడు ॥జడు॥
నిపదకరములుచిగురించునటుల - నేజేసెదదప్పక నేడు
యేపుమీరగనుసితలిదంద్రుల - ప్రాపునకంపించెదజూడు ॥జడు॥
ఘనముగరంగనాయకదాసా - వను జెప్పెడుమనమున వేడు
నినునాశ్రయించినట్టిపాపా - నీకము నిముసములో నేవీడు ॥జడు॥

వ॥ ఈవింతసమాచారంబిట్లుండ.

క॥ తలవరులు గొనినగురుతుల
నిలపతిసభనునిచి మింటనెసగిన పలుకుల్
పొలుపుగ దెలుపగ సభ్యులు
కళవళపడిరపుడు మిగుల కన్నీరొలుకన్ ॥

మంజరి.

ఘొలు ఘొలుమనిదుఃఖించెను ద - త్కుంభినిపతిసభలోన
బాలహత్యయిటు వాటిల్లెననుచు - బల్కెనుబంటులతోడ ॥

కమాచి - త్రిశ్రగతి.

త్వరగత్వరగత్వరగ చి - త్రాంగినితోడితెండుపోండు ॥త్వర॥
గరితముద్దుసుతునిపైని - కల్లలుజెప్పనామనసొప్పె ॥త్వర॥
అవనిలోననమ్మగూడ దాడువాళ్ళను - అగ్గినిబుట్టించగలరు నీళ్ళను
మహాచిత్రమైనట్టిమాటలెల్లను - మప్పిత్రిప్పికప్పవారికేచెల్లును - యీా
వనితలమాయ - ధరణినిరంగనాయ - కావను మునుడాయ - లేదా
కననైతినుపాయ - మైన మాయమది రాయియమ్యోనో యయ్యో వి
నుమయ్య సతినిచయ్యనగొప్పొగోయ పాతివేయ ॥త్వర॥

గీ॥ ఇటుల రాజాజ్ఞ జేకొని భటులుపోయి
జరిగినట్టిసంగతిజెప్ప గరితయనియె
గల్లమాటలువిని నృపుడల్లసభకు
రమ్మనగభయమేమని రమణివచ్చె ॥

మంజరి.

చిత్రాంగినిగని రాజనరేంద్రుడు - చెచ్చెరకోపముబూని
పుత్రదోషమ్ము నాకుగట్టితివి - ముందుయోచనలుమాని
నీమాటలువిని నాముద్దుసుతుస - నెనరుమానినరికింపర
స్త్రీమాయలుగగనవాణిజెప్పెను - నీటముంచితివికొంపర ॥

ఉ॥ కొంపలుమాపుచాన ధరగొంతులుగోయు కసాయిదాన నీ
పెంపరుమాటల న్వాడిచిపెట్టి యసత్యములేకపల్కుమా
యింపుగనిదుచెప్పు వెలయింపకయుండిన నేడునిన్ను నే
జంపుటకాజ్ఞయిత్తునన జందనగంధి హ్రాదిశుతోనన్ ॥

బేహాగ్ — త్రిశ్రగతి.

పల్కునెగగనవాణి యీాజగాన ప్రియమనోహరా! ॥పల్కు॥
అక్కడజెప్పిన విక్కడజెప్పిన జక్కగవినరా? ॥పల్కు॥
యేమియింతకల్ల వచ్చెనేణాంక ముఖా!
నేమముదప్పియుండుట నీతియే సఖా! ॥పల్కు॥

వట్టిమాటలెల్ల చెవిధి బెట్టనచ్చునా?
నెట్టన రంగదాసావనుజా జగజెట్టి మెచ్చునా ॥పల్కు॥

వ॥ ఈసంగతి రత్నాంగివిని సత్వరసభకువచ్చి చిత్రాంగినవలోకించి.

## సవతుల వాగ్వాదము.

### మాయామాళవగౌళ—రూపకము.

ర— ఎంతజేసితివె యువతీ - రంతులాడినాసవతి
బంతివలె గెంతకుగోతి - యోపందుకోతి మూతినాతీ!
నిండుపండుగాయె నారాతి ॥యెం॥

చి— ఈయెడ నిల్లాలివలె - చయ్యనవచ్చితివి బలె
కయ్యమాడవచ్చి నావలె యో - కానిముండ నీవు మండ
గ్రక్కన వేయింతును బొండ ॥యీ॥

ర— రంకులాడీ! దయమానిరాజుతోడ లేన్నిపోని
బొంకుమాటలెల్ల జెప్పితివా యో - రంకులాడి బొంకులాడి
చింపిచేటవలె మాయలాడి ॥యెం॥

చి— చింపిరేకలదాన - చిల్లరబేరాలదాన
కొంపమాపుదుంపవేచాన యో కంపుదాన
చంపుదునా? రంపముతోనిన్ను గోతునా? ॥యీ॥

ర— క్రన్ననసంబరవాణి గనిచెప్పెచేష్టలన్ని
పన్నగంబునిన్ను గరువదా యో బజారుగంప్పె
ముళ్ళకంపలోనవేసి ద్రొక్కినినుజంప ॥యెం॥

చి— ధరణిలో మద్దిరంగ - దాసునేలుజితానంగ
హాయునకుసన్ని దెలుసునె యో - దొరసానినసబోణి
యంబరవాణికేమిదెలుసునే ॥ఈ॥

వ॥ సవతులిద్దరు పోరుచున్నంత సభాసదులందరువినుచుండ నరణ్యాం
బున జెప్పినతెఱంగున మరలగగనవాణి పల్కెను.

ఉ॥ అంబరవాణిమాట నరులందరు జక్కఁగ నాలకించినే
రంబికదీనిదేయనిరి రాజనరేంద్రుఁడు చింతనొందికో
పంబున నాజ్ఞయిచ్చెనలపాపినిచూ చిత్రాంగి యుత్తమాం
గంబును ద్రుంచి తత్తనువు గ్రక్కున ద్రొక్కఁడి యుప్పుపాతరన్॥

మంజరి.

జనపతియాజ్ఞను గొనిజని వనితను - ఘనవీథులలో ద్రిప్పి
తనుపుతునుకలుగగోసి యుప్పుపాతరయందు వడిగ గప్పి

వ॥ పిమ్మట భటులరుదెంచి రాజునవలోకించి తామానతి యొసంగిన రీతి గావించితి మన నేలమగండువారల నింటికిబొమ్మని సెలవొసంగి క చేరీ మర్తరబు జేసి పుత్రునికై చింతాసాగరమున మునిగి యుండ వనంబున.

ఉ॥ బాలునిజూచివానియను బాలకనీదగుతల్లి దండ్రులన్
మేలుగబోయి చూడుమన మేటిగురూత్తము మాటబూనియా
బాలుడుపాదుకల్దొడిగి భక్తసువత్సల యన్న తోడనే
వాలెను కోటగుమ్మమున పౌరులువింతగ దన్నుజూడగన్ ।

మంజరి.

సారంగధరుడు పురికివచ్చెనని - ధారుణీ పతికిజెప్ప
కూరిమితలిదండ్రులు వచ్చిరితమ - కొడుకుదరికిముద మొప్ప
వచ్చినతలిదండ్రుల పాదములకు - వందనములనొనరించె
నచ్చుగనినుజూడగ వచ్చితినన - నవనిశుడుదుఃఖించె

రాజనరేంద్ర సారంగధరుల సంవాదము.

హిం—భైరవి—ఆదితాళము.

రా— తనయా! తనయా! వనజదళనయ - నా నేరము క్షమింపుమ
యకినుకబూని నినుశిక్షించియాపకీర్తి బొందితిసవినయ ॥తన॥

సా— జనకా! జనకా! నేపూర్వమ్ము జేసిన - జన్మాను భవమ్ము గాన
క - మనసు వశమైనా మాట కాదనక - మాయ మాటలను వి
నక ॥జనక॥

రా— నాకుమారుగా నాకుమార పట్టాభిషేకము - గైకొను తన
యా! నీకండ్లముందుగా మమ్ముల పర - లోకము జేర్చుము
తనయా! ॥తన॥

సా— గురు పాదంబులునా కుంజాలున - గరమొల్లను ప్రియజనక -
నాదరి పినతల్లి రానికారణము - తప్పక దెల్పుముజనకా ॥జన॥

రా— అంబుజాక్షి నేరంబులు సభలో - నంబరవాణి జెప్పెను తన
యా! కంబుకంధరి నుప్పుపాతర - నప్పగ నియమించితి తన
యా ॥తన॥

సా— బాలుర భామల వధియించుట గుణ - శీలదోషమది వినుమ - ఫా
లాక్షుని సత్కృపయుండిన నీ - వేళనది లేచుగనుమ ॥జనక॥

ఉ॥ నాతినిజంపినావు జననాయక నేడుతదంగ నామణిన్
బాతినతావుజూపు మొగి బాణము బోయుదు మానియావచో
వ్రాతమువిన్నవల్లునన రాజనరేంద్రుడు తత్ప్రదేశమున్
ఖ్యాతిగజూప బాలకుడు నాతిని లేపెను యోగవిద్యచేన్ ॥

వ॥ అంత చిత్రాంగి కుమారునిజూచి.

క॥ నీగుణములు నేనెరుగక
భోగింపదలంచియుంటి పుత్రుడవనకన్
లోగొను నాదగుతప్పులు
వేగమె మనకోటలోకి వేంచేయుమికన్ ॥

వ. ఇవ్విధంబున జిత్రాంగి పలుక గుమారుండు పినతల్లితో.

దర్వు - ఆదితాళము.

ఎవరురారు వెంటను అవనిలోను ॥ యె ॥

చూడకుందురుకంటను అవనిలోను ॥ యె ॥
మాతాపితానుత బంధుసహోదర హిత
జనులుందురింటను అవనిలోను ॥ యె ॥
పుడమిని జేసిన పుణ్యాపాపములు - విడువక వచ్చు వెంట
ను అవనిలోను ॥ యె ॥
రంగదాసావనునంత రంగమ్మునను నిల్పి దు - స్సంగుల
పొత్తునంటను అవనిలోను ॥ యె ॥

వ॥ ఇట్లు మాట్లాడుచున్న సారంగధరుని రత్నాంగిచూచి.

రత్నాంగి సారంగధరుల సంవాదము.

ఝుంఝూటి - ఆదితాళము.

ర— పుత్రమమ్మోడబాసి రోసి - పోయెదవా తండ్రి
మిత్రులతోగూడి యిచట - మెలగుచుండు తండ్రి ॥ పు ॥
సా— మిత్రులైనమనులే నా - శత్రులైన మనులే
ధాత్రిలోనఘునులే త్రి - నేత్రునిసమఘనులే ॥ మి ॥
ర— పట్టణంబునేలు నా - పట్టి! యం తేచాలు
చట్టునమముమేలగు త్రి - విష్టపంబుదోలు
సా— మునీంద్రుసదనంబు నా - ముఖ్యపట్టణంబు
ఘనమైనసౌఖ్యంబు - గలుగునునిజంబు
ర— ఇంద్రవైభవంబుగల - దిచ్చోట నిజంబు
చంద్రముఖవనంబు దు - ర్జంతుసముదయంబు
సా— భాసురాంగివినవే - రంగదాసునేలుకొనే కై
లాసపతిని వేడెదనే వన - వాసుల గూడెదనే ॥

వ॥ ఇటులబల్కుచు వారినెల్ల ననేక తెఱంగుల వినుతించి సారంగధరుడు గురుసమీపంబుజేరి శంకగుసిభజించి తత్పదంబు జూరంగొనియెను.

కల్యాణి - యేకతాళము.

మంగళకరహార సంగరపరహారలింగ శ్రీమంగళము జయ ॥ మం ॥
అంగజసంహార త్రిపురాంతకనుత ధృతభుజంగ శ్రీమంగళం జయమం॥
రాజరాజసఖా! రజనీవరముఖా! రాజనుతద్విజరాజ
రేఖా రాజితశంభు పరాజితధారణ రజితాద్రివాస
రాజీవాస్య సుజనాధరణ కుజనహరణ వృజినసంచ
యానిలబిలేశయ గజచర్మాంబర దయామయ జయ ॥ మం ॥
సారసవైరిమకుటధర సారసహితభాస క్రూరవినాశ
కుంభినీపోషసారయుమేశ సజ్జనవాస రంగదాస
క్లేశనాశన జయ ॥ మం ॥

సమాప్తము.

---

